**రుష్యాపరివర్తన వికాసములు**

మానవధర్మ వికాసాధ్యాయములందు రుష్యాపరివర్తన వికాసాధ్యాయములు విచిత్రాధ్యాయములు. ప్రపంచ పరిణామమునందు సృష్టిలయము లన్యోన్యాశ్రయములైన విధమును రుష్యాపరివర్తనము సువ్యక్తము చేయుచున్నది. సంహారముతో నారంభమైన సోవిటుమహోద్యమ ముపక్రమించిన నిర్మాణ విజృంభణము జిజ్ఞాసువులకు విస్మయమును గలుగజేయుచున్నది. మానవధర్మ వికాసమునకు సకల రాజ్యములందును, సంఘములందును, సంస్థలందును పరివర్తనావసర ప్రయోజనములను రుష్యాపరివర్తనము విశదము చేసినది. పదినైదేండ్లకు పూర్వము నిందాపరిహాసములకు పాత్రమైన రుష్యాదేశము వర్తమానకాలమునందు స్తోత్రగౌరవములకు పాత్రమైనది. రుష్యాయందు ప్రజలు జాతి మత లింగ దశా వివక్షత లేకను మానవధర్మావరోహణమును జేయుచున్న విధము మానవధర్మ వికాసమునందపూర్వాధ్యాయము. మానవ స్వాతంత్ర్య ధర్మము రుష్యాయందు వికసించి ప్రపంచ పరిణామమునందు నూతనాధ్యాయోదయమునకు సాధన మగుచున్నది.

వర్తమానవిషాదావస్థయందు సంగ్రామ నిరోధమునకును, శాంతిసంరక్షణమునకును రుష్యాకు గల పవిత్ర సంకల్ప మేయితర రాజ్యమునకును సాధ్యము గాకపోయినను జర్మను, జపాను రాజ్యముల సంగ్రామ ప్రయత్నములు సంగ్రామము ననివార్యము చేయుచున్నవి. దైవఘటన మెటులున్నను రుష్యా, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటనుల సంయోగము శాంతిసంరక్షణమునకును, సంగ్రామ ప్రతిఘటనమునకును వినియోగపడుట ప్రకృతి ధర్మము. శాంతిస్థాపనమున కేర్పడిన నానాజాతిసమితి శాంతిస్థాపనమునకు నిరర్థకమైన విధమును ప్రపంచవ్యవహారములు విశదము చేయుచున్నవి.

*  *  *  *

**నానాజాతిసమితి**

శాంతిస్థాపనమునకును, ఆయుధవిసర్జనమునకును, సంగ్రామప్రతిషేధమునకును, స్వల్పరాజ్య స్వాతంత్ర్య సంరక్షణమునకును నేర్పడిన నానాజాతిసమితి స్వీయప్రయోజన సంరక్షణములకే నిరుపయోగమైన విధమును ప్రపంచ వ్యవహారములు వేయినోళ్లను చాటుచున్నవి. నానాజాతిసమితియందు ౫౦ స్వతంత్ర రాజ్యములు చేరినను పెద్దరాజ్యముల ప్రయోజనములును, శ్వేతజాతుల ప్రయోజనములును ప్రధానవిషయము లైనవి. అబిసీనియాపట్లను నానాజాతిసమితియును, సమితియందు గల యూరపురాజ్యములును చూపుచున్న నిరాదరణభావము సమితి ప్రయోజనమును నిరర్థకముచేసినది. ఇటలీమీదను సమితి నిర్ణయించిన ఆంక్షలు మాటలందు వలెను చేతలందు గనుపడకున్నవి. అబిసీనియాయందు ఇటలీ చేయుచున్న ఘోరమైన హత్య లప్రతిహతముగను సాగుచున్నవి. ప్రపంచము హత్యలను నిరసించినను ప్రయోజనము గలుగకున్నది. గ్రేటుబ్రిటను మీదను ఇటలీప్రజలు ద్వేషగీతములను

పాడుచున్నారు. మధ్యధరాసముద్రమునందిటలీబలవిజృంభణము వ్యాప్తమగుచున్నది. ఇటలీ రోమకసామ్రాజ్యవిజయగీతములను పాడుట కుపక్రమించినది. ముస్సొలోనిగారి నాయకత్వముక్రిందను ప్రజలు కన్నుమిన్ను తెలియకను తాండవమాడుచున్నారు. హిట్లరు ముస్సోలినిగారల నిరంకుశ ప్రవర్తనము యుద్ధమునకు మార్గమగుచున్నది. యూరపు రాజ్యముల నావరించిన సంగ్రామసన్నిపాతము గ్రేటుబ్రిటనును నావరించినవిధమును మంత్రుల,నాయకుల ప్రసంగములు, పత్రికలవ్యాఖ్యానములు, సంగ్రామసన్నాహములు వెల్లడి చేయుచున్నవి. సామ్రాజ్యాభిమాన పూరితమైన బ్రిటీషుజాతీయ ప్రభుత్వము సంగ్రామరంగమునందు ప్రవేశించుటయును సహజావస్థగనున్నను, ప్రపంచశాంతి రక్షణభారమును, మానవస్వాతంత్ర్య రక్షణభారమును గ్రేటుబ్రిటనుమీదను విశేషముగ నున్నది.

* * * *

### గ్రేటుబ్రిటను మంత్రాంగము

బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములందును, బాహ్యరాజ్యములందును గ్రేటుబ్రిటను పట్లను విశ్వాసము క్షీణించుచున్న విధమును ప్రపంచ వ్యవహారములు విశదము చేయుచున్నవి. బ్రిటీషుమంత్రాంగము పరాభవమును పొందినవిధమును ఇండియాబిల్లు నను గ్రహించిన సర్ సామ్యుయలు హోరుగారి నిర్గమనము వెల్లడిచేయుచున్నది. ఐర్లాండు స్వాతంత్ర్యమును ప్రకటించి స్వాతంత్ర్యము ననుభవించుచున్నది. ఈజిప్టుహిందూస్థానములందు స్వాతంత్ర్యాభిలాష ప్రవర్ధమానంబగుచున్నది. వలసరాజ్యములందు స్వాతంత్ర్యప్రవర్తన మనివార్యముగను సాగుచున్నది. ఆత్మసంరక్షణమునకు గ్రేటుబ్రిటనుకు రక్షణవ్యాపారము శరణ్యమైనది. వ్యాపార పరిశ్రమ సంరక్షణమున కేర్పడిన ఒటావా యొడంబడికను సామ్రాజ్యాంతర్భాగములన్నియును నిరాకరించుచున్నవి. భారత సామ్రాజ్య సభయును నిరాకరించినది. సామ్రాజ్యాభిమానము మాత్రము యథేచ్ఛగను విహరించుచున్న విధమును బ్రిటిషు రాజ్యవ్యవహారములు, ముఖ్యముగనుహిందూస్థానవ్యవహారములు విశదము చేయుచున్నవి.

* * * *

### హిందూస్థాన వ్యవహారములు

బ్రిటీషుపార్లమెంటు ఇండియాబిల్లును ప్రసాదించినది. బిల్లును ఆచరణమునందు పెట్టుటకవసరమైనవ్యవహారక్రమమంతయును జరుగుచున్నది. ఆర్థికనిర్ణయములు, నియోజకవర్గ నిర్ణయములు మొదలగు వ్యవహారములన్నియును సాగిపోవుచున్నవి. బిల్లుననుసరించి సింధు ఒరిస్సారాష్ట్రములు నిర్మాణములయినవి. ౧౯౩౭ ప్రారంభమునం దన్నిరాష్ట్రములందునురాష్ట్రీయస్వపరిపాలనము స్థాపింపబడనున్నది. ఇండియాబిల్లునియమములు నిరంకుశ ప్రభుత్వరక్షణమునకు వినియోగపడునటులు స్వాతంత్ర్యవికాసమునకు వినియోగపడవని రక్షణములు, ధ్రువాధికారము, నిరంకుశ శాసననిర్మాణాధికారము మొదలగు రాజకీయార్థిక రక్షణోపాయములన్నియును సమర్థించుచున్నవి. ౧౯౩౭ నందు రానున్న రాజ్యాంగవిధాన మెటులు